# నా తమ్ముడు మాథ్యూ

కథ, బొమ్మలు: మేరీ థాంప్సన్, తెలుగు: కె. సురేష్



# నా తమ్ముడు మాథ్యూ

కథ, బొమ్మలు: మేరీ థాంప్సన్,   తెలుగు: కె. సురేష్



నా తమ్ముడు మాథ్యూకి పిల్లులంటే ఇష్టం. శనివారాలు పిల్లులను చూడటానికి మేం మా ఇంటి చుట్టుపక్కల విహారానికి వెళ్లేవాళ్లం. ప్రతి పిల్లితో ఆడుకోవటం మాథ్యూకి ఇష్టంగా ఉండేది, దాంతో మాకు చాలా సమయం పట్టేది.  అన్ని పిల్లులను అతను సమానంగా ఇష్టపడేవాడని నేను మొదట అనుకునేవాడిని. కానీ, అన్నిటిలోకి మా వీధి చివరలో ఉండే తెల్ల పిల్లి అంటే చాలా ఇష్టం అని నాకు తెలిసింది.



అన్ని పిల్లులలోకి తెల్ల పిల్లి అంటే మాథ్యూకి చాలా ఇష్టమని ఇతరులకు తొందరగా తెలియదు. మరి మా తమ్ముడు ఇతర పిల్లల లాగా మాట్లాడలేడు. అయితే మాథ్యూ చెప్పేది ప్రతిదీ నాకు బాగా అర్థమవుతుంది.

తెల్ల పిల్లిని చూసి మాథ్యూ ఎప్పుడూ, "అది నా పిల్లి," అనేవారు.

నిజానికి ఆ తెల్ల పిల్లి మాథ్యూది కాదు. అది మా పక్కింటి వాళ్లది. ఆ మాట మాథ్యూ మొదటిసారి అన్నప్పుడు ఆ తెల్ల పిల్లంటే అతనికి ఎంతో ఇష్టమని నాకు అర్థమయ్యింది.

మా తమ్ముడు మాటలే కాదు, అతని నడక, ప్రవర్తన కూడా ఇతర పిల్లల కంటే తేడాగా ఉంటుంది. మా తమ్ముడు పుట్టినప్పుడే ఎన్నో సమస్యలతో పుట్టడం వల్ల అలా ఉంటాడు.



మాథ్యూ పుట్టిన రోజు నాకు ఇంకా గుర్తు ఉంది.

అతనిని తీసుకుని అమ్మా, నాన్నా ఎప్పుడూ ఆసుపత్రికి వెళుతూ ఉండేవారు. నేను ఇంటి దగ్గరే ఉండి నాయనమ్మతో ఆటలు ఆడుకుంటూ ఉండేవాడిని. ఏం జరుగుతోందో నాకు ఎవరూ చెప్పేవారు కాదు.



చివరికి నా తమ్ముడిని ఆసుపత్రిలోని చిన్న కిటికీలోంచి చూడగలిగాను. అతని తోపాటు అమ్మ ఉంది, ఆసుపత్రిలో వేసుకునే ఆకుపచ్చటి గౌను వేసుకుంది. ఏవో యంత్రాలు, ట్యాంకులు, వెలుగుతూ, ఆరుతూ ఉన్న దీపాలకు జతచేసిన గొట్టాలు, తీగలు ఉన్న దేని మీదనో ఆమె వంగి చూస్తోంది.

ఆ ఏదో అనుకున్నది మా తమ్ముడు. ఆ పరికారలన్నింటితో అతను చిన్న పిల్లవాడి లాగానే లేడు. చివరికి చిన్న పిల్లలు వేసుకునే డయాపర్‌ని గుర్తించాను. అప్పుడు అతనే నా తమ్ముడు అయి ఉండొచ్చన్న నమ్మకం కుదిరింది

“ఆ గొట్టాలు, తీగలు ఎందుకు?” నేను నాన్నని అడిగాను.

“నీ తమ్ముడు ఊపిరి తీసుకోటానికి, ఆహారం తీసుకోటానికి, వెచ్చగా ఉండటానికి అవి ఉపయోగపడతాయి,” నాన్న చెప్పాడు. “అందరూ పిల్లల లాగా అతను ఈ పనులు చేసుకోలేడు.”

“ఎందుకని?” నేను అడిగాను. “తమ్ముడికి ఏమయ్యింది?”

“ఎవరికీ సరిగ్గా తెలియదు,” నాన్న చెప్పాడు.

నా పుట్టిన రోజు నాటికి కూడా తమ్ముడు ఇంకా ఆసుపత్రిలోనే ఉన్నాడు. మాకు సాయంగా నాయనమ్మ ఇంకా మా దగ్గరే ఉంది. ఇంట్లో అందరూ ఒత్తిడిలో ఉన్నారు.

“ఏది జరిగినా దాని వెనక ఒక కారణం ఉంటుంది. ఒక ప్రత్యేక బాలుడి సంరక్షణకు మనం ఎంచుకోబడ్డాం,” నాయనమ్మ చెప్పింది.

“అలాంటిదేం లేదు. కొన్ని, కొన్ని అలా జరుగుతాయి, అంతే!” నాన్న అన్నాడు.

నా పుట్టిన రోజు గురించి ఎవరూ మాట్లాడటం లేదన్నది ఒక్కటే నాకు అర్థం అయ్యింది.

పుట్టిన రోజు కొవ్వొత్తులను నాయనమ్మ వెలిగించటం మొదలు పెట్టిందో లేదో ఫోను మోగింది.

"మీ అమ్మ ఫోన్ చేసింది," నాన్న చెప్పాడు. "నీ తమ్ముడి ఆరోగ్యం మరింత దిగజారిందంట."

నాన్న వెంటనే ఆసుపత్రికి బయలుదేరాడు.

నాన్న రాత్రి బాగా పొద్దుపోయాక ఇంటికి తిరిగి వచ్చాడు. తమ్ముడు ప్రస్తుతానికి ప్రమాదం నుంచి బయటపడ్డాడని డాక్టర్లు చెప్పారట.

అయితే ఆపాటికి పుట్టిన రోజు వేడుకకి చాలా ఆలస్యం అయిపోయింది.



తమ్ముడికి అమ్మ పేరు నిర్ణయించిందని ఒక రాత్రి నాన్న చెప్పాడు – అది మాథ్యూ.

"చాలా మంచి పేరు," నాయనమ్మ అంది. "మాథ్యూ అంటే ప్రత్యేక బహుమానం."

అది విన్న నాన్న గట్టిగా నిట్టూర్చాడు. "అతను ప్రత్యేక బహుమానం అవునో, కాదో కానీ అతను మరికొంత కాలం ఆసుపత్రిలో ఉండాలి," అన్నాడు.

"ఎందుకని?" నేను అడిగాను. "తమ్ముడి ఆరోగ్యం బాగు కావటం లేదా?"

"బాగవుతుందనే ఆశిస్తున్నాం," నాన్న చెప్పాడు.

"తమ్ముడు త్వరలోనే ఇంటికి వస్తాడా?" నేను అడిగాను.

"తెలియదు," నాన్న బదులు ఇచ్చాడు.

ఎదురు చూసి, చూసి నేను అలసిపోయాను. నేను ఆందోళనతో కూడా ఉన్నాను. నా తమ్ముడికి ఏమవుతుందో? నా ప్రశ్నలలో చాలా వాటికి సమాధానం దొరకలేదు. వచ్చిన సమాధానాలు నాకు అంతగా అర్థం కాలేదు. అమ్మ, మాథ్యూ ఇంటికి రావాలని మాత్రమే నేను కోరుకున్నాను.

చివరికి మాథ్యూ సొంతంగా ఊపిరి తీసుకోసాగాడు, ఆహారం తినసాగాడు, వెచ్చగా ఉంటున్నాడు. తమ్ముడిని అమ్మా, నాన్నా ఇంటికి తీసుకుని వచ్చారు. ఎట్టకేలకు నా తమ్ముడిని నేను ఎత్తుకోగలిగాను. నాకు ఒక వైపున అమ్మ ఉంది, మరొక వైపున నాయనమ్మ ఉంది.

"జాగ్రత్త," అమ్మ అంది. "పడేస్తావేమో," నాయనమ్మ అంది.

నాకు ఏమీ తెలియదని వాళ్లు అనుకుంటున్నట్టు ఉంది! మాథ్యూ నిద్రపోతున్నాడని అనిపిస్తోంది. కానీ అతనిని ఎవరు ఎత్తుకున్నారో మాథ్యూకి తెలుసని నాకు నమ్మకంగా ఉంది. మాథ్యూ ఏమాత్రం ఆందోళనకు గురికావటం లేదు.

అమ్మా, మాథ్యూ ఇంటికి తిరిగి రావటంతో నాకు ఎంతో ఊరటగా ఉంది. ఇప్పుడు మేం అందరం కలిసి ఉంటున్నాం కాబట్టి మా కుటుంబం కూడా అందరి కుటుంబాల లాగానే ఉంటుంది. అయితే, ఇప్పుడు కూడా మాథ్యూని ఎంతో జాగ్రత్తగా చూసుకోవాల్సి ఉంటుందని అమ్మ చెప్పింది.

మా తమ్ముడిని జాగ్రత్తగా చూసుకోటానికి మేం చాలా కొత్త విషయాలు నేర్చుకోవాలని అమ్మ చెప్పింది. అప్పుడే అతని ఎదుగుదల, అభివృద్ధి బాగుంటాయి.

థెరపిస్ట్ అనే ఒక ప్రత్యేక వ్యక్తి మా ఇంటికి రావటం మొదలుపెట్టారు. మథ్యూని ఎలా చూసుకోవాలో, అతనితో ఏమేమి చేయించాలో అమ్మతో ఆమె మాట్లాడారు. మాథ్యూ కోసం ప్రత్యేకమైన బొమ్మలు, ఆటలు, వస్తువులు తీసుకుని వచ్చారు.

మాథ్యూ గురించి ఆమె, అమ్మా మాట్లాడుకుంటూ, పని చేసుకుంటూ ఉంటే నేను నిశ్శబ్దంగా ఆడుకుంటూ ఉండాలి. అన్ని కొత్త బొమ్మలు ఉండేసరికి నేను నా స్పేస్ స్టేషన్‌పై దృష్టి పెట్టలేకపోయేవాడిని. అయితే ఆ ప్రత్యేకమైన ఆట వస్తువులు మాథ్యూ కోసమే అంట.



ప్రతి రోజూ, దాదాపుగా రోజంతా తమ్ముడితోనే అమ్మ గడిపేది. అతనితో కొత్త ఆట వస్తువులతో ప్రత్యేకమైన ఆటలు ఆడేది. మాథ్యూతో ప్రత్యేకమైన వ్యాయామాలు చేయించేది. ఈ వ్యాయామాలు చేయించేటప్పుడు మాథ్యూకి వినిపించటానికి అమ్మ సంగీతం క్యాసెట్టులు కూడా తెచ్చింది. రోజులో చాలా భాగం ఈ సంగీతం వినిపిస్తూ ఉండేది. నా స్పేస్ స్టేషన్ తీసుకుని, పడుకునే గదిలోకి వెళ్లి ఆడుకునేవాడిని. మళ్లీ, మళ్లీ అదే సంగీతం వినటం కంటే ఒంటరిగా ఉండటమే మంచిదని అనిపించేది.

ఏ కాస్త సమయం దొరికినా మాథ్యూతో కొత్తగా ఏమి చెయ్యవచ్చో తెలుసుకోటానికి అమ్మ పుస్తకాలు చదివేది. తమ్ముడికి ఈత మంచిదని అమ్మ తెలుసుకుంది. దాంతో మేం ఈత కొలనుకి వెళ్లాం.

“నేను నీళ్లలోకి దూకుతున్నాను, చూడు,” అంటూ అరిచాను.

“మాథ్యూ మీదకి నీళ్లు చిందించకు!” నీటిలోకి దూకబోతుండగా అమ్మ హెచ్చరించింది. అయితే, నేను నీటిలోంచి బయటకు వచ్చేసరికి మాథ్యూ నవ్వుతూ, నీళ్ల మీద తపాతపా కొడుతూ ఉన్నాడు. నేను నీటిలోకి దూకటం అతనికి నచ్చినట్టు ఉంది.



ఒక రోజు మాథ్యూకి నా స్పేస్ స్టేషన్ గురించి చెప్పాలని నిర్ణయించుకున్నాను.

"ఇది చూడు!" అంటూ చంద్రమండలం మీదకి రాకెట్టుని వదిలిపెట్టాను.

మాథ్యూ కళ్లల్లో మెరుపు చూసి నా స్పేస్ స్టేషన్ అతనికి నచ్చిందని అనుకున్నాను. దాంతో రోబో చేతులు, టెలిస్కోపు వంటి మిగిలిన వస్తువులు కూడా చూపించసాగాను. అప్పుడు మొట్టమొదటసారిగా మాథ్యూ చాలా సంతోషంగా నవ్వాడు.



అది చూసి అమ్మ చాలా ఉత్తేజితం అయ్యింది. నాకు కూడా ఉత్సాహంగా అనిపించింది కానీ నేను ఆశ్చర్య పడలేదు. మాథ్యూని నేను మొట్టమొదటసారి ఎత్తుకున్నప్పుడే అతను నా లాగా ఉంటాడని నాకు అర్థమయ్యింది. నా లాగానే అతను అంతరిక్ష ప్రయాణాలు ఇష్టపడతాడని నాకు తెలుసు.

"మాథ్యూ నిన్ను చాలా ఇష్టపడుతున్నాడు కాబట్టి థెరపి పనులలో నాకు సాయం చేద్దువుగాని," అమ్మ నాతో అంది. మథ్యూతో చేయించే ప్రత్యేక వ్యాయామాలను అమ్మ థెరపీ అనేది.

థెరపీ కార్యక్రమం! నా గదిని శుభ్రం చేసుకోవటం అంటే వచ్చేటంత నీరసం ఆ మాట వింటే వచ్చింది. మాథ్యూతో నేను కేవలం ఆటలు ఆడాలని నిర్ణయించుకున్నాను.

మాథ్యూ చిన్నగా ఉన్నప్పుడు నాతో అన్ని ఆటలూ ఆడేవాడు. నా స్నేహితులు అలా కాదు, వాళ్లకి కొన్ని ఆటలు నచ్చేవి, కొన్ని నచ్చేవి కాదు.

"అంతరిక్ష పరిశోధకుల ఆటా ఆడదామా?" మాథ్యూని అడిగాను.

అతను ఒప్పుకున్నాడు.

అట్టపెట్టిలో మాథ్యూని కూర్చోబెట్టి అంతరిక్షంలో తిరుగుతున్నట్టు అతనిని ఇంట్లో తిప్పేవాడిని.

"డేవిడ్, మెల్లగా. మాథ్యూని అంత వేగంగా తిప్పకూడదు," అమ్మ అనేది. మాథ్యూ మాత్రం నవ్వుతూ, ఇంకా వేగంగా పోనివ్వమంటూ అరిచేవాడు.

ఇప్పుడు మాథ్యూ పెద్దవాడు కావటంతో అతనికి సొంత ఆలోచనలు ఉన్నాయి. అంతరిక్ష పరిశోధకులకంటే అంతరిక్షంలో పిల్లుల ఆట అంటే ఇప్పుడు అతనికి ఇష్టం.



అప్పుడప్పుడు మా తమ్ముడికి పుస్తకం చదివి వినిపించేవాడిని. మమ్మల్ని చూడటానికి నాయనమ్మ ఒకసారి వచ్చినప్పుడు ఈ చక్కని సలహా ఇచ్చింది.

"డేవిడ్, తమ్ముడికి పుస్తకం చదివి వినిపిస్తావా? అది చాలా బాగుంటుంది," నాయనమ్మ అంది.

దాంతో దాడి చేసే గ్రహాంతరవాసుల పుస్తకం నుంచి చదవటం మొదలుపెట్టాను. "కబూమ్!" అని చదివినప్పుడల్లా తమ్ముడు కదిలి నాకు, మరింత దగ్గరగా జరిగేవాడు.

"అయ్యో!" నాయనమ్మ అంది. "ఇటువంటి కథలు చదివితే తమ్ముడు భయపడిపోతాడు. అప్పుడు అతనికి నిద్ర రాదు..."

చదవటం అయిపోయిన తరవాత, "నీకు కథ నచ్చిందా?" అని తమ్ముడిని అడిగాను. కానీ, ఆపాటికే అతను నా వళ్లో నిద్రపోయాడు.

మా తమ్ముడి మాటలు నేను ఎంత బాగా అర్థం చేసుకోగలనో ముందుగా మా అమ్మ గుర్తించింది. మాథ్యూ మాట్లాడింది ఎవరికీ అర్థం కాకపోతే, అప్పుడు నా సహాయం అడుగుతారు.

"నారింజ రసం," మాథ్యూ ఆ మాట అనటం దాదాపు ఆరోసారి.

"తమ్ముడు ఏమంటున్నాడు, డేవిడ్?" నాన్న నన్ను అడిగాడు.

"నారింజ రసం. తమ్ముడికి నారింజ రసం కావాలంట," నేను బదులిచ్చాను.

"బ్లాక్స్!" మాథ్యూ అన్నాడు.

"ఏమంటున్నాడు, డేవిడ్?" నాయనమ్మ నన్ను అడిగింది.

"ఆడుకోటానికి మాథ్యూకి దిమ్మలు కావాలంట."

తమ్ముడి మాటలు వాళ్లకి ఎందుకు అర్థం కావో నాకు తెలియటం లేదు.

నేను వ్యాఖ్యాత లాగా పని చేస్తున్నానని నాన్న అంటాడు.

తమ్ముడు మాట్లాడటం అంతరిక్ష రేడియోలో నేను ఎన్నో గంటలపాటు విన్నాను కాబట్టి అతని మాటలు నాకు బాగా అర్థమవుతాయని నాకు అనిపిస్తుంది.



తమ్ముడితో ఆడుకోవటం అన్నిసార్లు అంత తేలిక కాదు. ఒక్కొక్కసారి నాకు అన్యాయం జరుగుతోందని బాధపడుతుంటాను.

ఒకసారి ఏం జరిగిందో చెబుతాను. మేం ఇద్దరమూ బ్లాక్స్‌తో ఆడుకుంటున్నాం.

"నేను చంద్రుడికి నిచ్చెన చేశాను, చూడండి," అమ్మా, నాన్నలను పిలిచాను.

కానీ, ఎవరూ నేను చేసింది చూడలేదు. మాథ్యూ మొట్టమొదటసారి బ్లాక్స్‌తో ఎత్తైన దిమ్మ చేశాడు. తరవాత తన దిమ్మెతో తమ్ముడు నా చంద్రుడి నిచ్చెనను పడగొట్టాడు. అందరూ తప్పట్లు కొట్టారు. ఆ క్రమంలో నేను చేసినది పాడైపోయిందని ఎవరూ గమనించినట్లు లేదు.

నా తమ్ముడు ఎప్పుడూ నన్ను అనుకరిస్తూ ఉంటాడు. నేను పుస్తకం చదువుతూ ఉంటే అతను కూడా చేతిలోకి పుస్తకం తీసుకుంటాడు. నేను బ్లాక్స్‌తో ఆడుకుంటూ ఉంటే అతను కూడా వాటితోనే ఆడతానంటాడు. నేను బొమ్మ గీస్తూ ఉంటే వెంటనే అతను కూడా బొమ్మ గీయటానికి పూనుకుంటాడు.

ఒకసారి డైనోసార్‌తో ఒంటరిగా ఆడుకోవాలని నాకు అనిపించింది. "అమ్మా, నన్ను అనుకరించవద్దని మాథ్యూకి చెప్పు!" అంటూ నేను అరిచాను.

"ఈ ప్రపంచంలో నువ్వే గొప్పవాడివని అనుకుంటున్నాడు కాబట్టి తమ్ముడు నిన్ను అనుకరిస్తున్నాడు, డేవిడ్. అది నీకు గర్వంగా అనిపించాలి కదా," అమ్మ నాకు నచ్చ చెప్పబోయింది. కానీ ఆ మాటలు నా చికాకుని పోగొట్టలేదు.



నేను ఎప్పుడైనా నా స్నేహితులతో ఆడుకుంటూ ఉంటే మాథ్యూ నా వెనకే తిరుగుతుంటాడు.

“నాన్నా, మాథ్యూ మాకు అడ్డుపడుతున్నాడు,” ఒకసారి నేను ఫిర్యాదు చేశాను.

“మాథ్యూకి కూడా మీ ఆటల్లో చోటు ఇస్తే బాగుంటుంది,” నాన్న చెప్పాడు.

“నేను పిల్లిని!” మాథ్యూ అన్నాడు.

“మాథ్యూ పిల్లి అంట,” నేను నా స్నేహితులకు చెప్పాను. మ్యావ్, మ్యావ్ అంటూ మాథ్యూ పిచ్చిపట్టిన వాడి లాగా అరుస్తూ ఉన్నాడు. నాకు ఇబ్బందిగా అనిపించింది. కానీ, నా స్నేహితులు అతనిని పట్టించుకోలేదు.





అప్పుడప్పుడు మా తమ్ముడు నన్ను నిజంగా ఇబ్బంది పెడుతుంటాడు. మా తరగతి పిల్లలు వేస్తున్న నాటకం చూడటానికి ఒకసారి అమ్మా, నాన్నలతో మాథ్యూ వచ్చాడు. నేను స్టేజీ మీద కనపడిన ప్రతిసారీ తమ్ముడు పెద్దపెట్టున అల్లరి చేయసాగాడు. పుస్తకం తీసుకోటానికి గ్రంథాలయానికి వెళ్లినప్పుడు మాథ్యూ గోల చేయకుండా ఉండేవాడు కాదు. ఎప్పుడైనా హోటల్‌కి వెళితే మాథ్యూ తప్పనిసరిగా తన పాలు ఒలకబోసుకునేవాడు.

తన తమ్ముడికి ఎటువంటి లోపాలు లేకపోయినా వాళ్ల ఇంట్లో కూడా సరిగ్గా ఇలాగే జరుగుతుందని నా ప్రాణ స్నేహితుడు అంటాడు.

నేను మా తమ్ముడితో పడుతున్నట్లు అందరూ తమ తమ్ముళ్లతో కష్టాలు పడతారనుకుంటా. కానీ, మా తమ్ముడితో ఉండే కష్టాలు చాలా ఎక్కువ.

కొత్త విషయాలు నేర్చుకోటానికి ఇతర పిల్లల కంటే మా తమ్ముడు చాలా కష్టపడాల్సి వస్తుంది. ఇందు కోసం అమ్మా, నాన్నల నుంచే కాకుండా ఇతర వ్యక్తుల నుంచి కూడా అతనికి అదనపు సహాయం అవసరం అవుతుంది. అతను ఏదైనా కొత్త విషయం నేర్చుకున్నప్పుడు మేమంతా చప్పట్లు కొట్టి ప్రోత్సహిస్తాం. మా తమ్ముడు కూడా సంతోషంతో చప్పట్లు కొడతాడు!

అయితే కొన్నిసార్లు మాథ్యూకి కొన్ని విషయాలు అర్థం కావు, కొన్ని పనులు చెయ్యలేడు. అప్పుడు అతను విచారంగా ఉంటాడు. నాకు కూడా విచారంగా అనిపిస్తుంది. నేను చిన్నప్పుడు నా పుట్టిన రోజుల కోరికగా మా తమ్ముడు ఇతర పిల్లల లాగా కావాలని కోరుకునేవాడిని. అయితే, కోరుకోవటం వల్ల అతని పరిస్థితి మారదని ఇప్పుడు నాకు అర్థమయ్యింది.

కొన్ని పనులు చెయ్యటం అతను నేర్చుకోగలడా అని మాకు అప్పుడప్పుడూ అనుమానంగా ఉండేది. అయితే, ఉన్నట్టుండి ఒక రోజున అతను ఆ పని చేసేసేవాడు. ఉదాహరణకు మాథ్యూ నడవగలుగుతాడని మేం అనుకోలేదు. రోజూ అతనితో అమ్మ అనేక రకాల వ్యాయామాలు చేయించేది. మేం ఆశలు వదులుకున్న తరవాత అతను ఒక రోజున నడవటం మొదలుపెట్టాడు.





"మాథ్యూ సైకిల్ తొక్కటం ఎప్పుడు నేర్చుకుంటాడు? అప్పుడు పిల్లులను చూసే విహారానికి తక్కువ సమయం పడుతుంది," ఒక రోజున అమ్మను అడిగాను.

"మాథ్యూ సైకిల్ తొక్కటం నేర్చుకోగలుగుతాడో లేదో మనం ఖచ్చితంగా చెప్పలేం," అమ్మ బదులు ఇచ్చింది.

"అతను సైకిలు తొక్క కలిగితే అది మామూలు సైకిలో లేదా ప్రత్యేకంగా రూపొందించిన సైకిలో మనం చెప్పలేం," అన్నాడు నాన్న.

మాథ్యూ సైకిల్ తొక్కడం నేర్చుకుంటాడని నాకు అనిపిస్తూ ఉంటుంది. అతను సైకిల్ తొక్కటం నేర్చుకున్నా పిల్లులను చూసే విహారానికి తక్కువ సమయం పట్టకపోవచ్చు. తెల్ల పిల్లి ఆరు పిల్లి పిల్లను పెట్టింది మరి.



# నా తమ్ముడు మాథ్యూ

ఏదైనా కుటుంబంలో లోపాలతో ఉన్నవాళ్లు పుడితే వాళ్ల ప్రత్యేక అవసరాలే కుటుంబ కేంద్రంగా మారతాయి. ఈ పరిస్థితులలో ఇటువంటి పిల్లలకు తోబుట్టువులుగా ఉన్న వాళ్లకి చాలా కష్టంగా ఉంటుంది. *నా తమ్ముడు మాథ్యూ*లో వైకల్యంతో తమ్ముడు పుట్టినప్పుడు తమ కుటుంబంలో జరిగిన సంగతులు, అన్నగా తన అనుభూతులను వాస్తవికతతోనూ, ఆర్ద్రత తోనూ డేవిడ్ పంచుకున్నాడు.